Reg. No. 1118.

# ఆంధ్రపత్రిక

315908

Founder : K, NAGESWARA RAO

VOL 30. ANDHRA PATRIKA, MADRAS. SATURDAY, 8-1-1944 No. 236




## రషియా దుడుకుతనం

### 'న్యూయార్క్ టైమ్స్' వ్యాఖ్య

న్యూయార్క్, జనవరి 7:— న్యాయవాది వెండెల్ విల్కీ మరొక కక్షిదారుని పోగొట్టుకున్నాడని ఛలోక్తిగా అంటూ, విల్కీపై ప్రావ్దా తీసిన దెబ్బను ఖండిస్తూ 'న్యూయార్క్ టైమ్సు' ఇలా వ్యాఖ్యానించింది: "అంతర్జాతీయ ప్రాచ్య యూరప్ రాజకీయ సమస్యల నిర్ణయంలో బలప్రయోగంచేతనే కార్యమును సాధించవలెను గనక సోవియట్ రష్యా పట్టుపట్టినట్లయితే యుద్ధానంతరం జరుగనలసిన విద్వమయమైనసంబంధికలోనూ పాల్గొనడానికి అమెరికా జంకవలసి వుంటుంది. స్నేహపూర్వకంగా విల్కీ చేసిన విమర్శను సమ్మానయుతులై స్వీకరించక పెద్దమనిషితరహా బొత్తుగా మాని రష్యనులు వర్తించారు. అంతేగాదు. తాము పెద్దమనుష్యులం కామని కూడా సగర్వంగా ప్రకటించుకుంటున్నారు.

#### దుడుకుతనం

"విల్కీ వ్రాసింది రష్యాపట్ల మిత్రభావంతోనని వ్యాసం చదివిన ప్రతి అమెరికను పాఠకుడు గ్రహించగలడు. రష్యనువ్యాఖ్యాత కావలెనని కయ్యమునకు కాలు దువ్వినాడు. విల్కీవ్యాసం సంపూర్ణంగా వ్యాఖ్యాత ఎదుట వుండెను. అక్కడక్కడ వ్యాసంలోని కొన్ని ముక్కలను ఆధారంగా చేసికొని అతడు విమర్శించలేదు. ఇది తెలిసీ తెలియక చేసినపనికాదు. ఈసందర్భములలో రష్యను వ్యాఖ్యాత విల్కీపై తీసినదెబ్బను బట్టి చూస్తేగా క్రమేణ అతిదాపులోకి వస్తున్న ప్రాచ్యయూరప్ సమస్యల నిర్ణయసమయంలో సక్రమవ్యవహారం జరగడానికి ఇది శుభసూచకం కాజాలదని తోస్తుంది.

#### అసంబద్ధం కాదు

విల్కీ వ్రాసినవ్రాత అసంబద్ధంగాలేదు. మునుపు అతడు వెల్లడించిన అభిప్రాయములనే వ్యాసంలో ప్రకటించినాడు. ఇందుకూ మిత్రమండలి ధోరణికి అనుగుణంగా అట్లాంటిక్ ప్రణాళిక ననుసరించి ప్రాచ్యయూరప్ సమస్యల నిర్ణయమునకు రష్యా అంగీకరిస్తుందా? లేక తాను చెప్పిందే ఆఖరుమాటగా నిర్ణయంచేసుకొని తన బలిమిపై ఆధారపడి ప్రవర్తిస్తుందా? అన్నది ఇంతేకూ మనుష్యులను బాధించే ప్రశ్న."

## యుగోస్లావియాలో మిత్రసేనలు దిగలేదు

లండను, జనవరి 7:— యుగోస్లావియాలో మిత్రబలము లేవీ దిగలేదని నేడు ఒక మిలిటరీ అధికారి స్పష్టీకరించాడు. అమెరికా యుద్ధశాఖ కూడా ఇదేమాట చెప్పింది.

భారీపద్ధ మిత్రబలములు, ఏడ్రియాటిక్ తీరంలో దిగి దండు విస్తరించడానికని, కేంద్రీకరించబడుతున్నవని స్విట్జర్లాండునుండి ఒకవార్త వెల్లడించింది. ఏడ్రియాటిక్ కోస్తాలో మిత్రరాజ్యసేనలు దిగినవని మరొకవార్త స్వీడన్ ద్వారా బయలుదేరింది. ఈ రెండు వార్తలు నిరాధారములేనని అంటున్నారు.

---

లండను, జనవరి 7:— కెనడానుంచి బ్రిటనుకు మరికొన్ని రిజర్వులు దిగినవి.

## అమెరికా అధ్యక్షస్థానానికి ఎన్నిక

### రూజ్‌వెల్టు మరొకపోటీ చేయునా?

వాషింగ్టను, జనవరి 7:— ఈ సంవత్సరం జరుగనున్న అధ్యక్షుని ఎన్నిక విషయమున అమెరికా ప్రజల నెదుర్కొను సమస్యలను వివరించుచు రూటరు ప్రత్యేక విలేఖరి ఇట్లు వ్రాయుచున్నాడు:—

ఈ పర్యాయం అమెరికా అధ్యక్షులు డెవరౌతారు? అని దేశంలో కలకలం బయలుదేరింది. అధ్యక్షపదవికి ఈ సంవత్సరం ఎన్నికలు జరుగుతవి.

ఆ పదవికి రూజ్‌వెల్టుతో పోటీచేయగల వారిలో రాయిటర్ ప్రత్యేకవిలేఖరి మువ్వురిని ముఖ్యంగా సూచిస్తున్నాడు. వెండెల్ విల్కీ, థామస్ డ్యూయీ, జాన్సన్. రిపబ్లికన్ పార్టీ కార్యవర్గం డ్యూయీపక్షపాతి. పార్టీ సాధారణసభ్యు లధికసంఖ్యాకులకు విల్కీపై అభిమానం. అందుచేత రిపబ్లికన్ పార్టీ పోటీచేయవలెనని నిర్ణయించుకుంటే ఇద్దరిలో ఎవరిని నిలబెడుతుంది అనేది చర్చనీయాంశం. వీరిద్దరికి త్రోసిరాజని ఆకస్మాత్తుగా అమెరికా వ్యాపారమండలి అధ్యక్షుడైన జాన్సన్‌వంటి అభ్యర్థిని పార్టీ సూచించవచ్చును. రిపబ్లికన్ పార్టీకి అభ్యర్థుల నియామకంలో గల సంకోచం రూజ్‌వెల్టుపక్షమునకు సహాయకారి కావచ్చునని కొందరి భావన.

#### రాజనీతిలో మార్పు ?

ఎన్నికలలో కొత్తవారు అధ్యక్షులైతే అమెరికా రాజనీతిలో కాగల మార్పేమిటి అన్నది చర్చనీయాంశం. పసిఫిక్ రంగంలో మరింత బలయుతమను మిత్రబల కేంద్రీకరణం జరుగవచ్చును.

మొదట జర్మనీ నాశనమైతేగాని అక్కడికి బలములను చేర్చడానికి వీలులేదనే రాజకీయవాదుల పక్షం బలహీన పడుతుంది. అయితే పసిఫిక్‌లోకి బలములు చేరేలోపుగా ఎటు దిరిగీ జర్మనీ ఓటమి ఖాయమేనని క్రొత్తగా అధికారంలోకి రాగలవారి విశ్వాస మని తోస్తుంది.

యుద్ధం త్వరగా మునిసిపోవలెననీ, సామర్థ్యంతో యుద్ధ వ్యవహారం సాగిపోవలెననీ అమెరికను లందరి నిశ్చయం. అందుకు తిరిగి రూజ్‌వెల్టు ఎన్నుకోబడడమే శ్రేయస్కరమని లోకుల అభిప్రాయంగా వున్నట్లు వినికిడి. కాని అతడే మళ్లీ అధ్యక్షుడౌతాడని రూఢిగా చెప్పడానికి లేదు.

నష్టేటు పుట్టినుంచడమా? యుద్ధం మధ్యలో కొత్తవారా అధ్యక్షులు, అనే ఒక భావం దేశంలో కొంత ప్రబలంగా వున్నదికనక, రిపబ్లికనుల నవాలుకు అది విరుగుడుగా ఉపయోగపడ వచ్చునని అంటున్నారు.

అయితే, దేశీయ వ్యవహారములు కేవలం దేశక్షేమాభిలాషతో నడపడం లేదని కాంగ్రెసు (రెండు శాసనసభల కూటం) అభిప్రాయమైనట్లు వినికిడి.

ఇక ఇప్పుడు అధ్యక్షపదవికి ఎన్నికలకు సంబంధించి పరిస్థితి ఈ విధంగా వున్నదని చెప్పవచ్చును. నిలిస్తే రూజ్‌వెల్టే మళ్ళీ నిల్చి నెగ్గవచ్చును: ఆ సందర్భంలో దేశీయ వ్యవహార నిర్వహణంలో అతడిపైన కాంగ్రెసు కంట్రోలు సహజంగా బిగువు తప్పకతప్పదు. కాక, ఒకపక్షంలో కాంగ్రెసు అతడికి విముఖంగా వున్నా వుండవచ్చును.

రూజ్‌వెల్ట్ ఓడినా ఓడిపోవచ్చును. లేదు తను నిల్వక, తన పక్షంవారిని మరొకరిని నిల్పవచ్చును. కాక, రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి అధ్యక్షుడు అయినా కావచ్చును.

#### యుద్ధనీతిలో తగాదా లేదు

ఎన్నికలలో యుద్ధనీతి వివాదకారణం కాదని స్పష్టమైనది. ఆవిషయంలో ఒక పక్షం దేశభక్తిని మరొక పక్షం ఈషణ్మాత్రం శంకించదు. దేశీయ వ్యవహార నిర్వహణమే సమస్య.

కాంగ్రెసు తమకు సంపూర్ణంగా కంట్రోల్ అధికారము లివ్వనందున గొడవలేర్పడినవని పరిపాలకవర్గం అంటుంది. పరిపాలకవర్గపు దేశీయవ్యవహార నిర్వహణంతో అసంతృప్తులై డెమోక్రాటిక్ (రూజ్‌వెల్టు) పక్షం అనుయాయులు దక్షిణాదివారు అనేకులు పరిపాలకవర్గపక్షంనుండి చీలి ఈవలికి వచ్చేశారు. తమ దృష్టిలో దేశీయ వ్యవహారాన్ని చక్కగా నిర్వహించగల అభ్యర్థికి వారు తమ వోట్లను ఈయవలెను. లేదా కొందరేటు, కొందరిటుగా చేస్తే, రిపబ్లికనుపార్టీ అభ్యర్థికి కొంత సహాయపడినవారవుతారు.

దేశంలో ధరల కంట్రోల్ అవసరమని చెప్పేవారు ఒక పక్షం, అక్కరలేదని చెప్పేవారు మరొకపక్షం ప్రబలంగా వున్నారు. అందుచేత చివరకు ఎన్నికలలో మొగ్గ యెటు తూగుతుంది అని జవాబ్దారీగల అమెరికను వారు డెవ్వడు ఊహించి చెప్పలేకున్నాడు.

## "మనలను జూచి జపాను బెదరలేదు"

### కర్నల్ నాక్స్ ప్రకటన

#### పసిఫిక్‌లో శత్రుజననష్టం హెచ్చు

వాషింగ్టన్, జనవరి 7:— "మనలను చూచి వారు బెదిరిపోయినారని అనుకోవడం తెలివి తక్కువ" అంటూ అమెరికా నౌకాశాఖామంత్రి కర్నల్ ఫ్రాంక్ నాక్స్ జపాను నౌకాబలముల స్థితిని గురించి పత్రికాప్రతినిధులతో ఇలా ప్రసంగించాడు:—

"జపాను నౌకలు బయటపడి పోరాడడానికి ఇది సమయంగాదని తలచి ఊరకున్న వేగాని మరేమీ గాదు. మన నౌకలు, విమానములు, అంగబలం అన్నీ అహోరాత్రులు రంగంలోకి వెళ్లి చేరుతూనే వున్నవి. జపానునౌకలు బయటికి రాగానే పోరు జరుగుతుంది. సంగ్రామఫలితం ఎప్పటికైనా ఒకటే. అది తెలిసిన విషయమే. ఎప్పుడు బయటికి రావాలె, ఎక్కడ మన శక్తులను ఢీకొనవలెను. అనే అంశములు జపానుబలముల కింకా నిర్ణయం కాలేదు."

పసిఫిక్ రంగంలో జననష్టాన్నిగూర్చి కర్నల్ నాక్స్ ఇలా ప్రకటించాడు: "జపాను పదివంతులు నష్టపడితే, అమెరికా ఒకవంతుకూడా సరిగా నష్టపడలేదు. గ్లస్టర్‌లో 2100 మంది శత్రుసైనికులు మరణించారు. అక్కడ మరణించిన అమెరికనుల సంఖ్య 117. అంటే జపానీయులు 20 వంతులు, అమెరికనులు ఒకవంతు మరణించారన్నమాట, గిల్బర్టుదీవులలో 400 మంది జపానీయులు 900 మంది అమెరికనులు హతులైనారు. గ్వాడాల్ కెనాల్‌లో 17,330 మంది జపానీయులు, 1950 మంది అమెరికనులు నష్టమైనారు. నౌకల సంరక్షణార్థం గ్వాడాల్ కెనాల్‌లో ప్రాణత్యాగం చేసిన అమెరికనుయోధుల సంఖ్య 25000, నుంచి 28,000 లోపు వుంటుంది.

#### దక్షిణ పసిఫిక్‌లో అమెరికాదే పై చేయి

"దక్షిణపసిఫిక్‌లో కేంద్రపసిఫిక్ రంగములో అమెరికను విమానబలానికే ఆధిపత్యము కద్దు. ముఖ్యంగా బోసెన్‌విల్లి, న్యూఐర్లండులలో అమెరికాకు మంచి పట్టున్నది. జపానువిమానాలు ఆరు నష్టమైతే అమెరికనువిమానం ఒకటి పోతున్నది. అమెరికనువిమానములు, నావలు శత్రునావలపై ఎడతెగకుండా దెబ్బతీస్తున్నవి."

#### జర్మనీపై మిత్రవిమానదాడులు

లండను, జనవరి 7:— శుక్రవారం వాయవ్యజర్మనీపై అమెరికన్ విమానాలు జరిపిన విమానదాడిలో 42 జర్మనువిమానాలు నాశనమైనవని అధికారరీత్యా ప్రకటించబడింది. అమెరికావి 12 బాంబర్లు 7 ఫైటర్లు కనిపించటంలేదట. ఒక ఫైటరు పైలటు క్షేమంగా వున్నాడట.

## 'ప్రతిష్ఠకై జర్మన్లు ప్రాకులాడరు'

### రష్యాలో నాజీసేనల తిరోగమనం గూర్చి జర్మను సైనికాధికారుల వ్యాఖ్య

స్టాకుహోం, జనవరి 7:— కేవలం ప్రతిష్ఠకోసరం రష్యాలో ఇదివరకు తాము ఆక్రమించుకొనిన ప్రాంతాలను తమ స్వాధీనమున నుంచుకొనుటకై జర్మనులు ప్రయత్నించరనియు, జర్మనుసేనలు రష్యాను పూర్తిగ వదలివచ్చినను అది సైనికముగ అంత ప్రధానవిషయముగ పరిగణింప నక్కరలేదనియు బర్లినులో ఒక ఉన్నత సైనికాధికారి అభిప్రాయం తెలిపినట్లుగ స్కాండినేవియావార్తాసంఘం ఒకవార్త ప్రకటించినది. పై వార్తనుబట్టి రష్యాలోనుంచి ఇంకా జర్మనులు వెనక్కు తగ్గవచ్చునని తేలుతోంది.

#### దండయాత్ర నిజమయ్యేట్లుంది

"పశ్చిమరంగంలో దండయాత్ర తప్పకుండా నిజమయ్యేరోజు వచ్చేట్లుంది." అని ఒక జర్మను వున్నతాధికారి చెప్పినట్లు స్వీడిష్‌పత్రిక విలేఖరి వార్తవల్ల తెలుస్తోంది. రష్యానుండి చాలాభాగం జర్మన్లు ఇతరచోట్ల కాచుకోవటానికి పూర్తిగా వెనక్కు తగ్గవచ్చునని కూడా అతనన్నాడట.



## దర్బనునందలి భారత ఉన్నత పాఠశాల

### శంకుస్థాపనోత్సవము ఆగిపోయినది

#### ఐరోపీయుల ఆక్షేపణఫలితము

డర్బన్, జనవరి 7:— ఇక్కడనందు నిర్మింపబడనున్న భారత పాఠశాల శంకుస్థాపనోత్సవము ఆగిపోయినది. దేశాంగమంత్రి జనవరి 11 వ తేదీన పాఠశాల ధర్మకర్తలతోను, 12 తేదీన ఐరోపీయులతోను ఈ విషయమై చర్చించును.

పాఠశాలను నిర్మించి, ఆక్రమించుకొనుటను పెగ్గింగుఆక్టుక్రింద దేశాంగమంత్రి పర్మిటు నొసంగియుండెను. జనవరి 8వ తేదీన ఆయన స్వయముగా పాఠశాల శంకుస్థాపన జరుపవలసియుండెను.

ఈ నూతన భారత ఉన్నత పాఠశాల నిర్మాణ సందర్భమున ద. ఆఫ్రికాయందలి ఐరోపీయజాతివారికిని భారతజాతివారికిని గొప్ప సంఘర్షణ యేర్పడు నవకాశములు కలవని నేటాలు యుద్ధానంతర పునర్నిర్మాణ సంఘాధ్యక్షుడును, నేటాలు రాష్ట్రీయ కార్యవర్గ సభ్యుడును అగు మిచ్చెలుగారు చెప్పిరి. హద్దులను నిర్ణయించినప్పుడు, ఆ హద్దులకు భారతీయులుగాని, ఐరోపీయులుగాని భంగము కలుగ జేయకుండ చూచుటవసరమని ఆయన చెప్పెను.

పెగ్గింగు ఆక్టు అమలులోనికి రాకపూర్వము పాఠశాలకై ఆ స్థలమును భారతీయులు కొనిరని డర్బను మునిసిపాలిటీ గుమాస్తా యిటీవల రేటు పేయర్ల సంఘము వారికి వ్రాసిన ఉత్తరమువల్ల తెలియుచున్నది.

## హిందూస్థానీయే రాష్ట్రభాష

### క్రొత్త హిందీ కొత్త ఉర్దూ పనికిరావు

### హిందీప్రచార్ పట్టప్రదాన సభలో బ్రెల్వీగారి ప్రసంగం

మదరాసు, జనవరి 8:— రాష్ట్రభాషగా ప్రాతఉర్దూ వుండడమే సమంజసమనీ, దానిని పునరుద్ధరించే ప్రయత్నం అహోరాత్రమ్ము ఇక మీద జరగవలెననీ పట్టభద్రులను ఉద్బోధిస్తూ, హిందీ ప్రచారసభాభవనంలో జరిగిన 12 వ సభా స్నాతకోత్సవసభలో జనాబ్ సయ్యద్ అబ్దుల్లా బ్రెల్వీ అధ్యక్షోపన్యాసంలో నేటిసాయంత్రం ప్రసంగించారు.

జనాబ్ బ్రెల్వీగారి అభిప్రాయంలో కొన్ని విషాదకరమైన సంఘటనల మూలాన పూర్వం దేశంలో వాడుకభాషగా వుంటూ వుండిన హిందూస్థానీస్థానమును ఆధునిక ఉర్దూ, హిందీభాషలు ఆక్రమించినవి. ఆ చరిత్రను వివరిస్తూ అధ్యక్షులు ఇలా ప్రసంగించారు.

"పంధొమ్మిదవ శతాబ్దారంభంలో సంస్కృతభూయిష్టమైన హిందీ ప్రాబల్యంలోకి వచ్చింది. ఉర్దూకాక, హిందీలో ప్రత్యేకంగా ఒక నిఘంటువును సిద్ధపరచవలసిందని సుదల్ మిశ్రా లల్లూలాల్‌గార్లను జాన్‌గిల్‌క్రిస్టు, ఫోర్ట్‌విలియంలోనితదితర ఆంగ్లప్రధానోపాధ్యాయులు ఆదేశించారు. ఈనిఘంటువుననుసరించిఇకమీదవ్యావహారిక భాష వుండవలెనని వారితలంపు. భారతదేశమునకు రాష్ట్రభాష' అనే గ్రంథంలో డాక్టర్ తారాచంద్ చెప్పినవే పై వాక్యాలు. సర్. జి. ఎ. గ్రియర్సన్ చెప్పినదానిని పరికించండి; "ఆంగ్లేయులు సంస్కృతభూయిష్టమైన హిందీకి పక్షపాతం చూపినారు. అంతే పెద్దమద్దతు గలిగి క్రొత్త భాష వుంటుంటే, పాతదానికి కట్టుబడిన ఒకరిద్దరు రచయితలు తప్పదానిని బట్టి నడిచినట్లే బంకిని ఆపలేకపోయినారు."

"మన పాలకులు ఆంగ్లేయులు, హిందువులకు ముస్లిములకు మధ్య ఏర్పడిన ఈ భాషావిషయకమైన భిన్నత్వమునకు చాలవరకు కారకులని చెప్పక తప్పదు. దేశంలో నలుగురిని ఏకంజేసే, అభివృద్ధి సూచకంగా వుండే ఏ ఉద్యమాన్నీ వారు నిరోధించక మానరు గదా! దేశంలో జాతీయభావం రేకెత్తతోనే హిందూనాగరకత పునరుద్ధరణకై కలిగిన నవోత్సాహంలో సంస్కృతభూయిష్టమైన హిందీకి మరింత ప్రాబల్యం కలిగింది. అదే కోర్టులలో, వ్యావహారికమైనది. బైబిలు అనువాదం అందులోని జరిగివుండెను. ఈ విధంగా క్రమేణ హిందూజన సామాన్యంలో సంస్కృత భూయిష్టమైనహిందీ ప్రబలింది. తద్విరుద్ధంగా సహజంగా అరబిక్, పారసీక పదములుగల ఉర్దూయందు ముస్లిములకు శ్రద్ధ హెచ్చింది. ఇందుచేత ఏకమైన పాతఉర్దూ లేక హిందూస్థానీకి బదులు క్రొత్తహిందీ, క్రొత్తఉర్దూ ప్రచారంలోకి వచ్చినవి."

#### కాంగ్రెసు చేసినపని చాలదు

హిందూస్థానీ ప్రచార విషయంలో కాంగ్రెసుసంస్థ కృషిని ప్రశంసించి బ్రెల్వీ ఇలా ఉపన్యసించారు:—

"కాంగ్రెసు సంస్థ చక్కని తీర్మానమే చేసింది గాని, దాని కృషి చాలినంతగా జరగలేదు. బీహారులో కాంగ్రెసు మంత్రివర్గం హిందూస్థానీ నిఘంటువు, వ్యాకరణం, పాఠ్యపుస్తకాలు వ్రాయమని కొందరిని పెద్దలను కమిటీగా వేసింది. ఆ పని ఇప్పటికీ అసంపూర్తిగానే వున్నది.

4-వ పేజీ చూడుడు

## కానేమాటలకు అర్థమేమి !

### రాజకీయ ప్రతిష్టంభన పరిష్కరింప వారు పూనుకొనెదరా?

లండను, జనవరి 7:— బెంగాలు గవర్నరుగ నియమింపబడిన రిచ్చర్డు కాసీగారు ఇటీవల గావించిన ప్రకటనలవల్ల భారతదేశ రాజకీయములం దేర్పడిన అవష్టంభనను పరిష్కరింప వారు పూనుకొనెదరా అను సందేహం ఏర్పడుచున్నదని ఒక ప్రత్యేకవిలేఖరి తంతివార్త పంపుచున్నాడు.

నిన్న పత్రికాప్రతినిధులతో ముచ్చటించినప్పుడు రిచర్డు కాసీగారు భారతదేశమునందలి ముఖ్య రాజకీయసమస్యల విషయమై చర్చలోనికి దిగడను విషయము స్పష్టమైనను, భారతదేశ సమస్యలను, ముఖ్యముగా బెంగాలు సమస్యలను ఆయన బాగుగా తెలిసికొనగోరుచుండెననియు, వెంటనే విచారింపదగిన సమస్యల పరిష్కారమునకై ఆయన తోడ్పడుననియు పత్రికాప్రతినిధులకు అభిప్రాయ మేర్పడెను. కేంద్రప్రభుత్వమువారితో సమాలోచనలు జరిపినమీదట తిరిగి తాను లండను వచ్చునని కాసీగారు నిన్న చెప్పుటవల్ల, విచారణలేకుండ, కాలపరిమితిలేకుండ చెరసాలలలో ఖైదీలను నిర్బంధమునం దుంచుటవల్ల నేర్పడిన అశాంతిని తగ్గింప నాతడు కృతనిశ్చయుడై యున్నట్లు గ్రహింపవచ్చును. బెంగాలు గవర్నరు ఉద్యోగమును స్వీకరింపగానే అధికారులతోను, దేశాభివృద్ధిని కాంక్షించు అనధికారులతోను సంప్రదించి యిందువిషయమై కేంద్రప్రభుత్వమువారికి సలహా నొసంగవచ్చునని గూడ తలపబడుచున్నది. కాసీగారు చేయగల పనివిషయమై రాజకీయబృందములవారు యెక్కువ ఆశలు పెట్టుకొనకపోయినను, బ్రిటిషు కామన్ వెల్తునందలి ఒక దేశపౌరు డగుటవల్లను, మధ్యప్రాచ్యములో గొప్ప ఉద్యోగమునందుండిన వాడగుటవల్లను, విశాల భావములు గలవాడగుటవల్లను, సమస్యనంతటిని సానుభూతితో నెదుర్కొని జపానుతో యుద్ధము సాగించుటకు మూలస్థానము కాగల బెంగాలులో శాంతి, క్రమపరిస్థితులనేర్పరుపగలడని తలచుచున్నారు.

#### బాసిల్‌లో విమానదాడి హెచ్చరిక

బాసిల్, జనవరి 7:— బాసిల్‌లో అర్ధరాత్రి బాటిననేర్పాటు విమానదాడి హెచ్చరిక జరిగింది.

## గంటల పంచాంగం

స్వభాను సం॥ పుష్య శు॥ చతుర్దశి 1944 సం॥ జనవరి 9 ఆదివారం
ఆ॥ నక్షు మ 2-40 ఆర్ద్ర తె 4-22 వర్జ్యం తె 11-52 ల 1-34 వ.
శు॥పూర్ణిమ జనవరి 10 సోమవారం
పా॥ పు మ 3-48 పుష తె 6-19 వర్జ్యం సా 5-20 ల 7-4 వ.


ఆంధ్రపత్రిక
స్వభాను సం॥ పుష్య శు॥ త్రయోదశి
శనివారము


# గ్రామాలకు వైద్యసౌకర్యాలు

పుష్టికరమైన ఆహారము లేక కొంత, తగినవైద్యసహాయము లేక మరికొంత, ఈ దేశములోని ప్రజల ఆరోగ్యము రాను రాను క్షీణించిపోవుచున్నది. ఇతర నాగరక దేశములలో ప్రజల జీవితపరిమాణము క్రమముగా హెచ్చుచుండ, ఈ దేశమున మాత్రము క్షీణించుచున్నది. ఈరీతముగ నీ పరిస్థితులు ప్రజలకును, ప్రభుత్వమునకును గూడ ఆందోళన కల్గించవలసియున్నది. సైన్సుకాంగ్రెసునందు వైద్యశాఖా సమావేశమున కధ్యక్షత వహించుచు డాక్టరు కె. వి. కృష్ణగారు, దెలిపిన వివరముల గాంచినయెడల, యిట్టి స్థితియందెట్టి విచిత్రము నుగనుపించదు. అమెరికా, బ్రిటను మొదలగు దేశములయందు జనాభాలో ప్రతి వెయ్యిమందికిని ఒక సుశిక్షితుడగు వైద్యుడు గలడు. ఈ దేశమున వెయ్యికంటె ఎక్కువ జనాభా గల గ్రామములు 4 లక్షలకుపైగా నున్నవి. ఇతర నాగరక దేశములలో వలె నీ గ్రామములకు సరియగు వైద్యసహాయము గావలెననిన యెడల నాల్గు లక్షల డాక్టరు లైనను కావలసియుందురు. కాని ఇపుడు నలుబదివేలమంది నైనను లేరు. వీరైననూ, పట్టణముల నంటిపెట్టుకొని యుండిరే గాని, పల్లెటూళ్లకు జను నుత్సాహము నే సూత్రమును కన్పరచుట లేదు. ప్రస్తుత మీ దేశమున గల 27 వైద్యకలాశాలలును కలసి, సాలీనా 17 వందల డాక్టరులను మాత్రమే తయారు చేయుచున్నవి. సాలీనా కనీసము 10 వేలమంది వైద్యులనైనను తయారుచేసిన గాని, నలుబదివత్సరములకైనను, ఈ దేశము, వైద్యసౌకర్యముల విషయమున ఇతర నాగరక దేశములతో సరిసమాన స్థితికి రాజాలదు.

ఈ సమస్యను సంతృప్తికరముగ పరిష్కరించుటకు కృష్ణగారు రెండు సూచనల గావించిరి. వానిలో నొకటి, వైద్యకళాశాలల సంఖ్యను సర్చియు, ప్రస్తుత మున్న కలాశాలలయందు ఎక్కువమంది విద్యార్థులకు వసతుల నేర్పరచియు, సాలీనా ఎక్కువమంది వైద్యుల తయారుచేయుట. రెండవది-శిక్షణను ముగించిన ప్రతి వైద్యుడును, కొంతకాలము గ్రామసీమలయందు వైద్యవృత్తిని సాగించవలెనని విధించుట. వీనిలో మొదటి సూచనను అనుసరించుట కెక్కువ కష్టముండదు. ఆర్థికవసతుల జూచుకొని, ప్రభుత్వమువారు యెన్ని వైద్యకలాశాలలనైన పెట్టవచ్చును; వైద్యుల తయారుచేయవచ్చును. కాని, అటుల తయారైన వైద్యులను పల్లెటూళ్లలో నివసింపజేయుట మాత్రము—అంత సులభమైనది కాదు. ప్రస్తుత మీ దేశమునందలి గ్రామసీమలలోని ప్రజల దారిద్ర్యము జగత్ప్రసిద్ధము. ఏ కొలదిమంది పెద్దరైతులో తప్ప, గ్రామములలో వైద్యునకు ఫీజు నొసగి, చికిత్సనందగల్గువారు గన్పించుట కష్టము. తినుటకు సరిగతిండి సైతము లేని ప్రజలు డబ్బిచ్చి చికిత్స పొందగలరని తలంచుటెట్లు? అనేక వత్సరములు కష్టించి, వేలకొలది సొమ్ము వెచ్చించి శిక్షణమంది వచ్చిన యువకులు—తగిన ఆదాయము లభించు ఆశ సేమాత్రం లేని గ్రామ సీమలకు జని, అచట యెటుల నివసించెదరు! గ్రామములకు మరల లేనని వారిని నిందించి ప్రయోజనమేమి. "ప్రజాసేవ యే భగవత్సేవ" యనుధర్మవాక్యములు, మంచి ఆచార్యముగల అదృష్టవంతులగు వైద్య శేఖరులు గంభీర ప్రసంగములయందు దుపయోగింపవచ్చును గాని, స్వార్జనపై జీవింపవలసియున్న యువకుల కెక్కువ కాలమాకర్షించజాలవు. అందుచే, గ్రామసీమలకు వైద్యసౌకర్యము లభింపవలెననిన తక్కువ ఆదాయము తో వారి కుటుంబ జీవితమునకు అవసరమగు కనీసపు భృతినైనను లభించునను నిశ్చయ ముండవలెను. ఇందుకుగాను గ్రామప్రజలనుండి యే సుంకము రూపమున వసూలుచేయవలసిన దని కృష్ణగారు సూచించిరి. కాని ఇదివరకే పన్నులభారముచే క్రుంగిపోవుచున్న పల్లెటూళ్ల ప్రజలీ కొత్త సుంకమును భరింపగల్గుట దుస్సాధ్యము. కనుక ఈ భారమును ప్రభుత్వమువారే వహించుట ధర్మము.

కృష్ణగారీ సందర్భమున, ఆయుర్వేదము, యునానీ మొదలగు దేశీయవైద్యపద్ధతులపైధ్వజమెత్తుట మాత్రము, అనవసర మగుటయే గాక, చాల అనుచితముగ నున్నదని చెప్పకతప్పదు. ఈవైద్యపద్ధతులు నిష్ప్రయోజనమనియు, శాస్త్రసిద్ధమైనవి గాదనియు వానిని పూర్తిగ బహిష్కరింపవలెననియు కృష్ణగారి వాదము. కొన్ని వత్సరముల క్రింద, దేశమంతయు పాశ్చాత్య వ్యామోహమున బడియున్న కాలమున, ఆంగ్లవైద్యశాస్త్రమును మాత్రమే అభ్యసించి తామే సర్వజ్ఞుల మని భ్రమించిన కొందరిట్టి ప్రసంగముల గావించియుండిరి. కాని ఆంగ్ల వైద్యశాస్త్రము గూడ ఇంకను పరిపూర్ణమైన శాస్త్రమని చెప్పుటకు వీలులేదని ఆంగ్లవైద్యులే ఇటీవల అంగీకరించుచుండిరి. ఈదేశమున ప్రజలు గూడ ఆంగ్ల వైద్యపద్ధతి అనుకొన్నంత అమోఘమైనది గాదని అనుభవపూర్వకముగ దెలిసికొనుచున్నారు. ఇంతమాత్రమున అల్లోపతీవైద్యమును నిరసించుచుంటిమని తలంపరాదు. ఆంగ్ల దేశమునను ఈ దేశమునను గూడ రాజాదరణను బడసి, ఆధునిక భౌతికశాస్త్ర విజ్ఞానపరిశోధనల సహాయముతో, ఆంగ్ల వైద్యము చాల అభివృద్ధిపొందిన విషయము నెవరును కాదనరు. భారతీయులు పరాధీన స్థితియందుండుటచే దేశీయవైద్య విధానము లిట్టి యభివృద్ధిని పొందజాలకపోయిన వను మాట గూడ నిజమే. కాని ఆయుర్వేదాది దేశీయ వైద్యములు — ప్రస్తుత క్షీణదశయందుగూడ—చాల విషయములలో ఆంగ్ల వైద్యమునకు దీసిపోవనియు, కొన్ని సందర్భములలో అంతకంటె దీక్షైనవనియు – అనేకు లిపు డంగీకరించుచున్నారు. ఇట్టిస్థితిలో తమకు దెలియనట్టి దేశీయ వైద్య విధానముపై కృష్ణగారిట్టి విమర్శలకు దిగుట కడు సాహసమనక తప్పదు. అందును, గ్రామసీమలకు వైద్య సౌకర్యముల దలపెట్టినపుడు, దేశీయ వైద్యముల విస్మరించుట కంటె అవజ్ఞతయుండదు.

# మూడు అనుపాకాలతో మితభోజనం

## ఇండియా ప్రభుత్వం కొత్త ఉత్తరువు

(స్వకీయ విలేఖరి)

ఢిల్లీ, జనవరి 7:—

హోటళ్లలో భోజనం చేసేవారికి మూడు ఆదరువులతో మూడువాయిలకంటె ఎక్కువ భోజనం పెట్టకూడదనే ఉత్తరువును ఇండియా గవర్నమెంటువారు జారీ చేస్తున్నారు. ఏ విందులో నైనను 50 మందికంటె ఎక్కువనుండిన విందు చేయరాదు. అట్టి ఉత్తరువుకూడా జారీ చేస్తున్నారు. గత ఢిల్లీ అసెంబ్లీసమావేశంలో యూరోపియను సభ్యులు ఆహారసమస్యను గురించిన చర్చ సందర్భములో యీ విషయములను ప్రస్తావించియుండిరి.

### రాజప్రతినిధి కార్యవర్గంలో మార్పులు

ఇండియాప్రభుత్వ ఖజానా సభ్యులగు రైజ్మన్గారి ఉద్యోగకాలపరిమితి ఏప్రిలు మాసంతో ముగియును కాని, యుద్ధము ముగిసేవరకు వారిని ఆ ఉద్యోగ పదవిలో ఉంచ దలంచినట్లుగా తెలియుచున్నది.

ఇండియా గవర్నమెంటువారి హోం మెంబరగు మాక్స్వెల్లుగారు ఏప్రెలుమాసములో ఉద్యోగమునుండి విరమిస్తారు. వారి స్థానే కొత్తవారిని నియమిస్తారు. ప్రస్తుతం ప్రైవేటు సెక్రటరీగా ఉంటున్న సర్ జాన్ థారన్గారు గాని, బీహారు గవర్నరుగా ఉంటున్న మూడీగారు గాని, కొత్త హోం మెంబరుగా నియమింపబడవచ్చును.

### బట్టలరవాణాల తనిఖీమండలి

ఇండియానుంచి దిగుమతి చేయ బడు బట్టలసరకును తనిఖీచేయుటకు డైరెక్టరుల మండలి యొకటి యేర్పాటుచేయబడును. ఎగుమతిచేయుటకు నిర్ణయింపబడిన సరకు మీద ఆమాట వ్రాయబడును. నుడ్డల సరకు నాణ్యమును అపరిపాలనమండలి తనిఖీ చేయును.

జేకమ్యంలో ఖర్చు అగుటకు ఉద్దేశం పబడిన బట్టలసరకును తనిఖీ చేయుటకు కూడా ఒక హైలెక్ట్ర మండలి యేర్పాటు చేయబడును. నుడ్డల కొట్లలలో తక్కువ కొల్త కన్పించు చున్నదనియు, బట్టలను అక్కువ నూలుతో నేయుచున్నారనియు చాలా ఫిర్యాదులు వస్తున్నాయి. ఈతనిఖీ సంఘములను యేర్పాటుచేయుటను గూర్చి బొంబాయిలో సమావేశమగు బట్టల నేతపరిశ్రమ సలహామండలి రాబోవువారం చర్చించును.

# యుద్ధానంతర మహిళోద్ధరణం

యుద్ధానంతరం భారతదేశ మహిళాసంఘమును ఉద్ధరించుటకు తగిన సాధనోపాయములనుగూర్చి ఆలోచించుటకై ఇండియా ప్రభుత్వమువారి పునర్నిర్మాణ కమిటీవారొక నోమలు సర్వీసు సబు కమిటీని ఏర్పాటుచేశారు. ఈ కమిటీలో 10 మంది ప్రముఖ భారతీయ స్త్రీలు కలరు. వారిలో లేడీ కవాస్జీ జహాంగీరు, లేడీ రామారావు, బీగం హమీదాలీ, శ్రీమతి రేణుకారాయిసతి, కలరు. సబు కమిటీకి సర్ సుల్తాను అహమ్మదుగారు అధ్యక్షత్వం వహిస్తారు. వారికి బీగం షా నవాజుగారు కార్యదర్శినిగా వ్యవహరించును.

యుద్ధానంతర పునర్నిర్మాణకమిటీ సభ 15-1-44 తేదీని ఢిల్లీలో జరుగును. యన్. ఆర్. సర్కారుగారుకూడా ఆ సభకు హాజరవుతారు.

# 116 సం॥ వయస్సులో కొత్త దంతాలు

భోపాలు, జనవరి 7:—

భోపాలు సంస్థానములో ఒక మారుమూల సంములో హకీమా బీబీ అనే 116 సంవత్సరముల వయస్సుగల ముసలమ్మకు తిరిగి యిప్పుడు కొత్త దంతాలు మొలుస్తున్నాయి. దంతాలు చిన్నవిగాను, పదునుగాను ఉన్నాయి, లేనకు 32 పళ్లు తిరిగి కొత్తవి మొలుస్తాయని ఆశతో వృద్ధు ధైర్యంగా చెప్పుతూంది.

### కలకత్తాలో చావులు

కలకత్తా, జనవరి 7:—

కలకత్తాలోను పరిసరములలోను గల ఆస్పత్రులయందు నిన్నటిదినం నిరాధారులైనవారు 8 మంది మరణించిరి. 16 మంది తిరిగి క్రొత్తగా చేర్చుకోబడిరి. వీరిలోనేడు 7 మందిని తిరిగి పంపివేయబడిరి.

# ఇండియా మంత్రివద్దకు లేబర్పార్టీ రాయబారం

## బెంగాల్ క్షామము విషయమై చర్చ

లండన్, జనవరి 7:—

ఇండియామంత్రి ఎమెరీగారు నేడు లేబర్పార్టీ కార్యవర్గమువారి రాయబారమునకు దర్శనమిచ్చి భారతదేశమునందలి ఆహారపరిస్థితులను గూర్చియు, ముఖ్యముగా బెంగాలు క్షామమునుగూర్చియు, గంటసేపు చర్చించిరి. బెంగాలు క్షామమునుగూర్చియు, ప్రస్తుతపరిస్థితులనుగూర్చియు, ఆహారసమస్య నెదుర్కొనుటకు ఈసంవత్సరము ఇండియా ప్రభుత్వమువారవలంబింపదగిన విధానమును గూర్చియు—సమగ్రచర్చ జరిగెను. ఇండియా ప్రభుత్వమునుండియు, బెంగాలు ప్రభుత్వమునుండియు వచ్చిన తాజా సమాచారములను ఎమెరీగారు రాయబారవర్గమువారికి కెరింగించిరి.

రాయబారవర్గములో ప్రొ॥ హెరోల్డు లాస్కీ, (నాయకుడు) సొర్దు మెంటు సభ్యుడగు రెజినాల్డు సొరెన్సను, లేబర్పార్టీ కార్యనిర్వాహకసభ్యుడగు టామ్ విలియమ్సన్, రైల్వేపనివారి యూనియను అధ్యక్షుడగు బత్తోన్, లేబర్పార్టీ కార్యదర్శి జేమ్స్ మిడిల్టనుగారలు సభ్యులుగా నుండిరి.

### సొరెన్సన్గారి ప్రకటన

రాయబారమును పంపుటకు గల కారణములను గూర్చి సొరెన్సనుగారు ఈ క్రింది విధముగా వివరించి చెప్పిరి:—

లేబరుపార్టీ ఇండియా కమిటీవారు బెంగాలు క్షామపరిస్థితులను విచారించియుండిరి. బెంగాలుకు ఆహారపదార్థములను విరివిగా పంపుటంతో అవసరమో తెలుపుటకును క్షామమువల్ల ప్రబలిన అంటువ్యాధులను నివారించుటకు తగిన చర్యలు గైకొనవలెనని ఆశక్తి తెమి నిరూపించుటకును, ఎమెరీని దర్శింపదగిన ప్రయత్నములు గావింపవలెనని సదరు కమిటీవారు నిర్ణయించియుండిరి. కమిటీ నిర్ణయమును లేబర్పార్టీ కార్యవర్గమువారు సంపూర్ణముగా నామోదించిరి. ఈ నిర్ణయమును ననుసరించి మేము నేడు ఎమెరీగారివద్దకు రాయబారము వెళ్లితిమి.

క్షామమునకు బాధ్యతను బ్రిటిషుప్రభుత్వమువారు సంపూర్ణముగా నంగీకరింపవలెననియు, వెంటనే ప్రతిక్రియలు చేయవలెననియు, ముందు యిట్టివిపత్తులు సంభవింపకుండ దీర్ఘకాల కార్యక్రమమును విధానమును అవలంబింపవలెననియు మొదటేనుండియు నేను చెప్పుచుంటిని. నేటిసభలో మొదట ప్రొ॥ లాస్కీగారును, తరువాత నేనును ప్రకటన గావించితిమి. ఎమెరీగారు దీర్ఘముగా ప్రత్యుత్తర మొసంగిరి. సభలో జరిగిన ప్రసంగములను రహస్యముగా నుంచుటకు మాలో మేమంగీకరించితిమి.

# నూనెల వాయిదా వ్యాపార నిషేధం

## జనవరి 12 నుండి అమలు

ఢిల్లీ, జనవరి 7:—

8-1-44 తేదీ గల ఇండియా గెజెట్టునందు ఇండియా గవర్నమెంటు యీ క్రిందరీతిగా ఒక ప్రకటన చేసెను:—

వేరుసెనగనూనె, అవిసెనూనె, ఆవనూనె, కుసుమనూనె, ఆముదం, పత్తిగింజలచనురు, కుసుమనూనె, కొబ్బరినూనె, యీ నూనెల వ్యాపారంలోను, యీ నూనెల తాలూకు గానుగపిండి వ్యాపారంలోను ముందు వాయిదా కంట్రాక్టులు జరగకూడదు. 12-1-1944 వ తేదీ నాటికి వ్యాపారం ముగిసినతోడనే అనంతరం వాయిదా జట్టీ బేరాలు ఎవరున్నూ చేయకూడదు. సదరు తేదీకి మించిన వాయిదా బేరాలు వైనిపైనను వర్తకులు ఒప్పుకొని యున్నయెడల అట్టి బేరాలను ఇండియా గవర్నమెంటువారు నిర్ణయించెడి రేట్లకు ఫైసలు చేసి కంట్రాక్టులను తీర్మానం చేస్తారు.

పై చెప్పిన తైలములుగాని, గానుగపిండిగాని, ఏవైనా కొన్ని ప్రత్యేకసరకును ఒక నిర్ణీత తేదీకి, నిర్ణీత కిమ్మతుకు డెలివరీ చేయుటకు ఒప్పుకోబడియున్నయెడల అట్టి డెలివరీ ఆర్డర్లుగాని, ట్రైబురసీదులుగాని (మూడో ఆసామికి ట్రాన్సుఫరుచేయుటకు వీలులేనట్టి సరకు డెలివరీ రశీదులుగాని) ఉన్నయెడల అట్టివానికి పైచెప్పిన ఉత్తరువు వర్తింపజాలదు.

### ఇండియన్ ఫైన్ ఆర్ట్సు సొసైటీ

మద్రాసు, జనవరి 8:—

9వ తేదీ ఆదివారం సాయంత్రం 5½ గంటలకు గోఖలేహాలులో శ్రీమతి జె. శ్యామల (తిరుపతి) పాటకచేరి జరుగుతుంది.

### ఫైన్ ఆర్ట్సు అకాడమీ

ఆదివారం 9 వ తేదీ సాయంత్రం 6 గం॥ లకు శ్రీమతి కుమారి రుక్మిణి భరతనాట్యం చేస్తుంది.

# ఉపాధ్యాయుల సమ్మె ఉపాధ్యాయినుల ప్రాయోపవేశం

## హెచ్చుధరల అలవెన్సు కోసం

అహమ్మదాబాద్, జనవరి 7:—

పి. ఆర్. ట్రెయినింగ్ కాలేజీలోనూ, స్త్రీల ట్రెయినింగ్ కాలేజీలలోనూ ట్రెయినింగు పొందుతూన్న 240 మంది ఉపాధ్యాయులూ, 110 మంది స్త్రీలూ ఇవాళ ఉదయంనుంచీ సమ్మె ప్రారంభించారు. ఉపాధ్యాయులు మూర్ఖోని సమ్మెసాగిస్తున్నారు. ఒక్కరోజు ఉపవాసం చేస్తారు. స్త్రీలు ప్రాయోపవేశాన్ని ప్రారంభించారు. అధిక ధరల అలవెన్సు నివ్వవలసిందిగ వీరు ప్రభుత్వాన్ని కోరారు. అది ఇచ్చేవరకూ ఇల్లా సాగిస్తారు.

సమ్మె చేసినవాళ్లపై శిక్షణచర్య తీసుకోవలసిందిగ విద్యాశాఖా డైరెక్టరు స్థానిక విద్యాసంస్థాధికారులకు తెలిపాడు.

ప్రస్తుతం రూ 7 మొదలు 8 వరకు నెలకు హెచ్చుధరల అలవెన్సు ఇస్తున్నారు. సమ్మెదార్లు దాన్ని రూ 11 మొదలు 14 వరకు చెయ్యవలసిందిగా కోరుతున్నారు.

### సూరత్లో సానుభూతిసమ్మె

సూరత్, జనవరి, 7:—

సూరత్ జె. జె. ట్రెయినింగ్ కాలేజీలో 60 మంది ట్రెయినింగు టీచర్లు అహమదాబాదు ఉపాధ్యాయులతో సానుభూతి చెల్లిస్తూ ఒకరోజు ఉపవాసం చేశారు. హెచ్చుజీతం హెచ్చు అలవెన్సులు ఇవ్వకపోతే ఉపాధ్యాయులు జనవరి 20 నుంచి సమ్మె సాగిస్తారు.

# అహమదాబాదులో మొహరం అల్లరులు

## కర్ఫ్యూవుత్తర్వు అమలు

అహమదాబాదు, జనవరి 7:—

మొహరం వూరేగింపు అల్లరుల సందర్భంలో కర్ఫ్యూవుత్తర్వు నమలుపరచటానికి పోలీసులు కన్నీటివాయువు నుపయోగించారు. జాగ్రత్తకోసం రాత్రి మిలిటరీని గూడా పిలిపించారు. చాలమందిని అరెస్టు చేశారు. పోలీసులపై కొందరు రాళ్లురువ్వారు. కర్ఫ్యూవుత్తర్వు అమలులోనున్న సమయంలో శాంతంగానే వుంది. 20 మంది తుంటరులను అరెస్టుచేశారు.

ఇవాళవుదయం వూరేగింపు జరుగుతూండగా ఒక తాయా కొనితెపు సత్తానికి పోలీస ఆఫీసరు పేముబెత్తం పొరబాటున తగిలినందుకు అతడు క్షమాపణ చెప్పకున్నాడు. అన్ని ప్రాంతాలలోనూ తాజియాలను ఆపారు. యింకో పోలీసు ఆఫీసరుపై రాయి వచ్చిపడింది. అతడు కాలుస్తాననేసరికి జనం మరింత పట్టుపట్టాల్లే కుంగా చరించారు. ఉద్రేకం హెచ్చింది. చివరకు పోలీసులు బాష్పవాయు ప్రయోగం చేయ్యాలసివచ్చింది. వూరేగింపు చేసేవాళ్లు తజియాలను వదిలిపోవలసివచ్చింది.

గతరాత్రి ఆయుధాలు తీసుకుపోరాదని పోలీసులు జారీచేసిన నిషేధపు టుత్తర్వునకు అసమ్మతి సూచకంగా వూరేగింపులో మోపులుగా తీసుకుపోయే 'అఖాడా'లు తీసుకుపోలేదు. కాంగ్రెసువుద్యమ ఆరంభం నాటినుంచీ ఈ వుత్తర్వు అమలులో వుంది.

సాయంత్రం 4 గంటలకు తజియాలను తీసివెయ్యనందున నాల్గరోజులపాటు రాత్రి 8 గంటలు మొదలు వుదయం 6 గంటలవరకు వీధులలో సంచారంగాని కూర్చోటంగాని, నడవటంగాని చెయ్యరాదని జిల్లామేజస్ట్రేటు కర్ఫ్యూవుత్తర్వు జారీచేశాడు.

### కాన్పూరులో ప్రమాదం

కాన్పూరు, జనవరి 7:—

కాన్పూరులో ఇవాళ మధ్యాహ్నం మొహరం వూరేగింపు చూడటానికి మిద్దెవసారాలోకి రాగా అది విరిగి పడింది. ముగ్గురు మరణించారు. 7 గురు గాయపడ్డారు. ఇందు చాలామంది ముస్లింలే వున్నారు. గాయపడ్డవారిని ఆసుపత్రికి జారవేశారు.

నాగపూరు, కరాచి, లక్నో, లాహోరు, సూరత్ నగరాల్లో మొహరంపండుగ ప్రశాంతంగా గడచిపోయింది.

### ధరలు తగ్గించాలి

మదరాసు, జనవరి 8:—

ఆహారపదార్థముల ధరలు తగ్గించి, మదరాసు నగరంలో కట్టెల రేషనింగు త్వరలో అమలు జరపాలని తీర్మానించుటకు, ప్రత్యేక కార్పొరేషను సభ 11 వ తేదీ ఓ. గ. జరుగును.

### బస్సు రేట్లు పెంచుట

మదరాసులో బస్సుల రేట్లు నేటినుండి పెంచబడెను. కనీసపు ఛార్జి 0-0-9 గను అదివరకు 0-1-3 ఉన్న టిక్కెట్టు 0-1-6 గను మార్చిరి. కొన్ని మార్గములందు యింతకన్న యెక్కువగనే పెంచిరి.

# మదరాసుకు బ్రెల్వీగారి రాక

## స్టేషనువద్ద గొప్ప స్వాగతం

చెన్నపురి, జనవరి 8:—

అఖిలభారత వార్తాపత్రికల సంపాదక మహాసభాధ్యక్షులు బొంబే క్రానికల్ సంపాదకులు ఎస్. ఎ. బ్రెల్వీగారు ఇవాళవుదయం 6-30 గంటలకు బొంబయి మెయిలులో మద్రాసుకువచ్చారు. సెంట్రలుస్టేషనులో వారికి పత్రికాప్రతినిధులు ఘనమైన స్వాగతమిచ్చారు. సంపాదకులమహాసభ సన్మానసంఘం, ఆంధ్రరాష్ట్రపత్రికా రచయితల సంఘం, తమిళనాడు పత్రికారచయితల సంఘం, ఇంకా ఇతరసంస్థల తరఫున బ్రెల్వీగారికి పుష్పమాలలర్పించారు.

బ్రెల్వీగారు తెల్లటిఖద్దరులాగు, తెల్లని షెర్వాని, గాంధీటోపీతో దిగారు. శ్రీ కె. శ్రీనివాసన్ (హిందూ) శ్రీ కోటంరాజు పున్నయ్య (సిండ్ అబ్జర్వర్) శ్రీ శివలెంక శంభుప్రసాద్ (ఆంధ్రపత్రిక) శ్రీ రామనాథ్ గోయింకా (ఇండియన్ ఎక్స్ప్రెస్) ఎస్. వి. స్వామి (ఫ్రీప్రెస్) జె. ఎ. సహానీ, చొక్కలింగం, శ్రీ వైద్యుల రఘునాథరావు మున్నగువారలు స్టేషనుకు వచ్చారు. బొంబయి మెయిలు రావటానికి ముందుగానే పత్రికా సంపాదక మహాసభాధ్యక్షునికి గౌరవ పురస్సరస్వాగత మివ్వటానికి సంపాదకులు, విలేఖరులు, పత్రికా రచయితలు రైల్వేస్టేషనుకు హాజరయ్యారు. మిత్రులతో కుశలప్రశ్న జేసుకొని బసకు వెళ్లిపోయారు.

ఇవాళ చెన్నపురి ఆంధ్రమహాసభలో సంరాష్ట్ర పత్రికా రచయితల సంఘం నాడు 4½ గం॥లకు శ్రీ కోటంరాజు పున్నయ్యగారి అధ్యక్షతను బ్రెల్వీగారికి విందు చేసి సన్మానపత్రం సమర్పిస్తారు. సాయంత్రం 6 గం॥లకు హిందీ పట్టభద్రులకు స్నాతకోపన్యాసమిస్తారు.

వందేమాతరం సంపాదకులు శ్రీ అమృతలాల్ సేట్, పి. డి. శర్మ (యునైటెడ్ ప్రెస్) గారలు బొంబయి మెయిలులోనే దిగారు.

శ్రీ కోటంరాజు పున్నయ్యగారు నిన్న రాత్రి వచ్చారు.

### బొంబయి ప్రతినిధులు

బొంబయి, జనవరి 6:—

సర్ ఫ్రాన్సిస్ లో, ఎ. ఎస్. భరతన్, ఎన్. సి. జేకాయి-శ్యాంమల్దాస్ గాంధీ గారలు ఇవాళ ఎక్స్ప్రెస్ లో మద్రాసుకు బయలుదేరారు. కె. శ్రీనివాసన్ (ఫ్రీ ప్రెస్ జర్నల్) గారు ముందుగానే బయలుదేరారు.

# విదేశీ వస్త్రముల సరకు నిల్వచేయరాదు

## ఎక్సైజు కమీషనరు ప్రకటన

బొంబాయి, జనవరి 8:—

ఎక్సైజు కమీషనరు యీ క్రింది విధంగా ఒక ప్రకటన చేసారు:—

విదేశవస్త్రములనుగాని, నూలుగాని కొనుగోలుచేసికొనే వ్యాపారస్తులు ఆసరుకును తమవద్ద ఉంచుకోనుటకై చాయిదాగడువు హెచ్చించగల లైసెన్సును పొందవలెను. అట్టి లైసెన్సు సర్టిఫికేటు ఏసరకు నియమముల ప్రకారం ఇవ్వబడునో 21-9-43 తేదీని మేముచేసిన ప్రకటనలో వివరించియున్నాము దరఖాస్తు చేసినవారికి దాని నకలు పంపబడును.

కొత్తగా సరకును తెప్పించుచునటువంటి వారు లైసెన్సులకొరకై పంపుకొనే దరఖాస్తులయందు సదరు సరకు ఏ కిమ్మతు ప్రకారం దిగుమతియైనదో వివరించాలి. రేవులోనుంచి సదరు సరకు డెలివరు అయిన తేదీనుంచి మూడు మాసాలలోగా ఆ బేళ్లను తెరచుటను, ఆ సరకును 6 మాసాలలోగా పూర్తిగా అమ్మివేయుటకున్నూ అనుమతి యివ్వబడును.

### పిఠాపురం రాకుమార్తె వివాహం

చెన్నపురి, జనవరి 7:—

పిఠాపురం మహారాజాగారి మూడవ కుమార్తె శ్రీ సీతాదేవిగారు బరోడా మహారాజాగారిని గత శుక్రవారం బొంబయిలో వివాహము చేసుకున్నట్లు తైమ్సు ఆఫ్ ఇండియా తెలుపుచున్నది.

### చెన్నపురి ఆంధ్ర పండితమండలి

మండలివారి ఆధ్వర్యమున విక్టోరియా పబ్లిక్ హాలులో రేపు సాయంత్రము శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు "కవిత్వము – దాని ప్రయోజనము" అను విషయమును గూర్చి ప్రసంగిస్తారు.

### కమలాదేవిగారి అస్వస్థత

శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయిగారు బెలూరు జెయిలులో అస్వస్థతగ నున్నందున, యెట్టి షరతులులేక ప్రభుత్వంవారు విడిచెదరని తెలియుచున్నది.

